నుండి మంచి యభ్యాసములలో పెంచబడుదురు. మరికొందరు దురభ్యాసములలో పడిన పిమ్మట మారుమనస్సు నొందెదరు. పైనుదాహరింపబడిన తరగతి మనుష్యులలో రెండవ తరగతివారు సద్గుణములను సంపాదించుకొనుట మిక్కిలి కష్టముగ నుండునుగదా? కావున పైతరగతులలో మొదటి తరగతికంటె రెండవ తరగతిలో చేరినవారి వృద్ధి తక్కువగ నుండినయెడల ఆశ్చర్యపడవలసిన పనిలేదు. అయితే ముఖ్య విషయము—మనలో నెంత వృద్ధి కలదు అనునది కాదుగాని, మనలోని వృద్ధినిబట్టి మనము క్రమక్రమముగా నెట్టివారమగుదుము. మంచివార మగుదుమా దుర్మార్గుల మగుదుమా యనునదియై యున్నది. కావున మనము అంతకంతకు మంచివారమగునట్లు చూచుకొనవలెను. మనలోని వృద్ధి యెంతకొద్దిదైనను, అది నిత్యమైన దగునెడల, ఏ మాత్రమును వెనుకబడక మనము సద్గుణములను పెంచుకొనగలము. అయితే మనము ఊరకయే యుండినను అట్టి వృద్ధి నొందగలమని యనుకొనరాదు. కష్టముకొలది ఫలము అను లోకోక్తి విశ్వాస విషయములలోను చెల్లును. ఊరకయే యుండుటవలన మనము చెడిపోగలముగాని, ఏ మాత్రము మంచివారము కాజాలము. మనము మంచివారము కావలెనని కోరినయెడల మనలో నుండు దుష్ట బుద్ధితోను మన చుట్టు నుండు చెడ్డవాటితోను మనము నిత్యముగా పోరాడవలసియున్నాము. జీవకిరీటము నొందగోరు వారు మరణ పర్యంతము నమ్మకముగా నుండవలెను (ప్రక. 2: 10).

మనకుండవలసిన సద్గుణములలో వృద్ధి కలదా లేదా యని పరీక్షించుకొనవలెను.—క్రీస్తునందు కనబడు గుణలక్షణములు నానాట మనలో కనబడుచున్నావా లేవా యని ధ్యానించుకొని యీ విధముగ మనలను మనమే పరీక్షించుకొనగలము. మరియు మనలోని పగ అసూయ యను గుణములకు ప్రతిగా మనలో ప్రేమ కనికరములు కనబడునా? గర్వమునకు ప్రతిగా వినయ మున్నదా? అబద్ధము లాడుట మాని సత్యమే పలుకుచున్నామా? లోభిత్వమునకు ప్రతిగా ఔదార్య బుద్ధి గలిగి యున్నామా? కామమునకు సంబంధించిన పాపములకు బదులుగా పరిశుద్ధ ప్రవర్తన నవలంబించితిమా? ఇహలోక సంబంధములగు వాటిని ఆశింపక పరలోక సంబంధమైనవాటిని ఆశించుచున్నామా? ముంగోపులమై విచ్చలవిడిగా వదరుచున్నామా? క్రమక్రమముగా యీ పాపములను అణచివేయుచున్నామా? నానాటికి స్వలాభము నాశింపక, ఇతరుల మేలు నాశించుచున్నామా? దేవుని సేవయందు అనుదినమును ఆనందించుచున్నామా? ఆయనను ప్రేమించి, ఆయనను ఆశ్రయించుకొని, ఆయనను సంతోషపెట్టుటకు అనుదినమును ప్రయాసపడుచున్నామా? అనునవి మొదలగు ప్రశ్నలను మనకు మనము వేసికొని, మనలను పరీక్షించుకొని మన క్రైస్తవ జీవమునందు వృద్ధినొందుచున్నామో లేదో యని తెలిసికొనగలము.

ఈ క్రైస్తసద్గుణములలో వృద్ధి నొందునట్లు మనము దేవుని సహాయమును వేడవలెను.—దేవునికి అనుకూలమైన వాటిని మనము కోరు నట్లును, చేయునట్లును మనలో కార్యసిద్ధి కలుగజేయువాడు దేవుడే (8). ఆయన సహాయము లేనియెడల మనలోనుండు దుష్టబుద్ధిని మన చుట్టు నుండు శోధనలను మనము జయింప జాలము. మనము మన పాపములను అనుదినమును ఒప్పుకొని ఆయన క్షమాపణను వేడుకొనుచు, ఇక మీదట వాటిని జయించుటకై శక్తి సహాయ ముల నిమ్మని ప్రార్థింపవలసి యున్నాము. నిండు మనస్సుతో నడుగువారికి దేవుడు తప్పక వాటి ననుగ్రహించును (2. కొరి. 12:9). మనలను నడిపించి, ప్రోత్సాహ పరచి బలపరచుటకు మనకు పరిశుద్ధాత్మ అవసరమై యున్నాడు. తన నడుగువారికి దేవుడు పరిశుద్ధాత్మ యను వరమును దయచేయును (4).

మనము విసుకక పట్టుదలతో ఈపని చేయవలెను.—మనము మేలు చేయుటయందు విసుకక యుండవలయును (5). దేవుడు తన గొప్ప దయవలన మన పాపము లన్నిటిని క్షమించునని మనము గట్టిగా నమ్మకొనవలెను. అయితే అదియట్లుండగా మనము మన పాపములను విడిచి నీతిగా జీవించినను జీవించకపోయినను అంతయు నొకటేయని యెంతమాత్రము ననుకొనక నీతిగా ప్రవర్తించుటకు మన శక్తికొలది ప్రయాస పడవలెను. పాపమునకు లోనైనవారమై జీవించకూడదు. దానికి లొంగితి మేని మనము దేవుని బిడ్డలము కాక ఆయన యుగ్రతకు పాత్రుల మగుదుము. మనము నిజముగా పశ్చాత్తాపపడినయెడల ఆయన దయవలన ఆయన బిడ్డల మగుదుము. మరియు అనుదిన పశ్చాత్తాపమువలన గాక మరి దేనివలనను ఆ స్థితిలో నిలువజాలము.